Reg. No. M. 4479.

విడిపత్రిక 2 అణాలు.



# ఆంధ్రపత్రిక

Founder : K. NAGESWARA ROW — WEEKLY EDITION

vol.39. | ANDHRA PATRIKA, MADRAS. SUNDAY, 14-9-47 సర్వజిత్ సం॥వి. శ్రావణ బ॥అమా॥ | NO.54



# పర్షియా, సోవియెట్ రష్యా సరిహద్దులో తీవ్ర సైనికసంరంభం

## "ఢిల్లీ జీవితాన్ని తారుమారు చేయడం దేశానికే పెద్దముప్పు"

### నగరశాంతి రక్షణ బాధ్యత: సర్దార్ వల్లభాయ్ పటేల్ విజ్ఞప్తి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 12: రాజధానీనగర శాంతిని, గ్రామ జీవితాన్ని, ప్రధాన సేవా కార్యములను భంగమువాటిల్లకుండా కాపాడవలసిందని భారతప్రభుత్వ దేశాంగ శాఖా మంత్రి సర్దార్ వల్లభాయ్ పటేల్‌గారు ఢిల్లీ పౌరులకు విజ్ఞప్తి చేసిరి.

ఢిల్లీ జీవితాన్ని తారుమారు చేయడంవల్ల యావత్తు భారత దేశ సంఘజీవనానికే ముప్పు తెచ్చిపెట్టినట్లు అవుతుందని సర్దార్ పటేల్ హెచ్చరించిరి.

పరస్పర తప్పులెన్నడంలో యావచ్ఛక్తినీ కేంద్రీకరించడం బదులు పరస్పరం సహాయం చేసుకొనడంలో మనశక్తిని యావత్తూ వినియోగించాలని వల్లభాయ్ హితోపదేశం చేశారు. భారీఎత్తున జనాభాపరంగా జరగడంవస్తే ఏవిధంగా ఉంటుందో ఇంచుమించు ఇప్పుడు శరణాగతుల సురక్షిత ప్రాంతాలకు చేర్చడంకూడా అంతపెద్ద సమస్యగా పరిణమించిందనీ, ఈ క్లిష్టసమస్యా పరిష్కారానికి ప్రతిఒక్కరూ యథాశక్తి సహాయం చేయాలని వల్లభాయ్‌పటేల్ విన్నవించిరి.

ఈ రాత్రి అఖిలభారత రేడియో ఢిల్లీకేంద్రంనుండి ఈ విజ్ఞాపనము చేసిరి.

## పెట్రోల్ గనుల సమస్య పెద్ద సంఘర్షణకు దారితీసే సూచన

### ఉత్తరసరిహద్దుకు మూడు పర్షియన్ సాయుధయంత్రదళాల ప్రయాణం

టెహరాన్, సెప్టెంబరు 12: మూడు సాయుధయంత్ర శకట దళాలను ఉత్తర సరిహద్దుప్రాంతానికి పర్షియా పంపినట్లు ఇక్కడకు వార్తలువస్తున్నవి. తనసహజసంపత్తిని తనయిష్టంవచ్చినట్లు పర్షియా ఉపయోగించుకొనుటకు అమెరికా సర్వవిధముల సహాయపడగలదని టెహరాన్‌లోని అమెరికన్ రాయబారి జార్జి ఎల్లెన్ ప్రకటించినతరువాతనే, ఈచర్యజరుగుచున్నది. ఉత్తరసరిహద్దునుండి వస్తున్న ప్రయాణీకులు, సోవియట్ భూభాగంలో టాంకులరణగొణధ్వనులు, మరతుపాకుల కాల్పులు, రాత్రులు సెర్చిలైటు ప్రయోగ శిక్షణసన్నాహాలు జరుగుచున్నట్లు చెప్పుచున్నారు. రూసో-పర్షియన్ పెట్రోల్ ఒడంబడికను భగ్నంచేయటం ప్రమాదకరమగునని రష్యన్ పత్రిక "ప్రావ్డా" పర్షియాను ఈమధ్యనే హెచ్చరికచేసింది.

#### అమెరికా ప్రకటన

జార్జి ఎల్లెన్ తన ప్రకటనలో రష్యా ప్రసక్తి తేలేదు. ఆయన ఇట్లాఅన్నాడు. "పర్షియా సంపత్తి పర్షియాకే చెందుతుంది. పర్షియా దాన్నిని ఉచితదాన ధర్మం చెయ్యవచ్చు; లేదా, ఎంతఖరీదుకైనా అమ్మకపోవచ్చు. వర్తకవాణిజ్య విషయమైన సూచనలతో అమెరికాకు సంబంధంలేదు. కాని పర్షియా తిరస్కరించినచో ప్రమాదం కల్గునని భయపెడుతూ చేసిన సూచనలతో మేము ప్రవేశపెట్టుకుంటాం. తమ నిర్ణయములను స్వేచ్ఛాపూరితంగా చేయటానికి అమెరికన్ ప్రజలుకూడా సంపూర్ణంగా సహాయం చేస్తారని పర్షియా ప్రజలు నిస్సందేహంగా విశ్వసించవచ్చును."

#### రష్యా రాయబారి ఒత్తిడి

టెహరాన్‌లోని రష్యన్ రాయబారి సదిక్చోవ్ ఆగస్టు 12వ తేదీన పర్షియా ప్రభుత్వమునకు ఒక వర్తమానం

6 వ పేజి చూడుడు

## వీటో అధికార ప్రయోగ సమస్య

### సమితిసభలో రష్యా ప్రతిఘటించె సూచన

మాస్కో, సెప్టెంబరు 13: ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశంలో అగ్రరాజ్య వీటో అధికార ప్రయోగ సమస్యపై రష్యా చాలా పట్టుదల చూపబోతున్నట్లు తెలుస్తున్నది. వీటో అధికారాన్ని పరిమితం చేయరాదని రష్యాకోరిక. పరిమితం చేయడం అవసరమని అమెరికా ప్రతినిధి మార్షల్ జాన్స్ సూచించియున్నాడు. ఇండోనీషియా, కొరియా సమస్యల విషయంలో అమెరికాపై రష్యా కొన్ని నిందారోపణలను సైతం చేయవచ్చు. కొరియా విషయంలో రష్యా ఒక ప్రత్యేకపత్రం తయారుచేసింది. అక్కడి ప్రజాస్వామ్యవర్గాలను అమెరికనులు బాధిస్తున్నారన్నది ఈ ఫిర్యాదులలో ఒకటి. దక్షిణాఫ్రికాలో భారతీయుల సమస్యపై జరిగే చర్చలో భారత ప్రభుత్వవాదాన్ని రష్యా బలపరుస్తుంది. సమితి ప్రణాళికను మార్పుచేసి వీటో అధికారాన్ని సవరణచేయటానికి ఏదైనా ప్రయత్నం జరిగితే తీవ్రంగా ప్రతిఘటించవలసిందని రష్యా ప్రభుత్వం తమ ప్రతినిధికి ఆదేశించినట్లు కూడా తెలుస్తున్నది.

## అంతర్జాతీయ బ్యాంకు

### భారతదేశంవాటా తగ్గించరాదని ఉపసంఘ నిర్ణయం

లండన్, సెప్టెంబరు 12: భారతదేశం విభక్తమైనప్పటికీ, అంతర్జాతీయ బ్యాంకుకు భారతదేశం చెల్లించవలసిన వాటా తగ్గించరాదని అమెరికన్ ఆర్థికశాఖ సహాయ కార్యదర్శి విలియం క్లేటన్ సూచనపై అంతర్జాతీయ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి ఉపసంఘం అంగీకరించినది.

పాకిస్తాన్ ఈ రెండు సంస్థలలోను ఇంకా చేరలేదు. కాబట్టి పాకిస్తాన్ వాటా ప్రసక్తే లేదు.

## ఇండోనీసియాలో యుద్ధవిరమణ పరిశీలకులపై తుపాకి కాల్పులు

### సైనికనిపుణుల సహాయం కోరుతూ తమ ప్రభుత్వాలకు విదేశప్రతినిధుల విజ్ఞప్తి

బటేవియా, సెప్టెంబరు 12: ఇండోనీసియాలో యుద్ధ విరమణ ఆజ్ఞలను ఏ విధంగా పాటించుచున్నారో పరిశీలించుచున్న 6 గురు కన్సల్‌లలో యిద్దరు ఈ రోజు మరతుపాకి కాల్పులకు గురిఅయిరి. బ్రిటిష్ కన్సల్ లాంబర్టు, ఆస్ట్రేలియన్ కన్సల్ చార్లెస్ ఈటన్ గారలు తమ సిబ్బందితో, నాలుగు జీప్ కార్లు, ఒకసిబ్బంది కారులో వెడుతూవుండగా వారికి 500 గజాల దూరంనుండి వారిపై కాల్పులు జరిగాయి. మలంగ్ ప్రాంతంలో దర్యాప్తులు జరిపి వీరు తిరిగి వస్తూవుండగా ఈ సంఘటన జరిగింది. ఎవ్వరూ గాయపడలేదు. ఈ కాల్పులు రిపబ్లికన్లు చేశారని డచ్‌వారు నిందారోపణ చేస్తున్నారు.

యుద్ధ విరమణ ఉత్తరువులు ఏవిధంగా ఆచరణలో పాటింప బడుతున్నవో పరిశీలించుటలో తమకు సహాయపడుటకు సైనికనిపుణులను పంపవలసిందని కన్సల్‌లు విజ్ఞప్తి చేశారు. దీనికి ఫలితంగా ఆస్ట్రేలియానుండి బ్రిగేడియర్ లూడ్లెక్ నాయకత్వాన 4 రు నిపుణులు వచ్చి, సౌరబాయాలో దిగారు.

వంతెనలు పడగొట్టటం, తోటలు తగలబెట్టుట, నీటిపంపు లైనులు తెగగొట్టుట మొదలైన చర్యలు ఇండోనీసియా అంతటా జరుగుచునే వున్నవి. తమ సైనికులు యిద్దరు మరణించినట్లు, 19 మంది గాయపడినట్లు డచ్‌వారు ప్రకటించారు.

#### ఆస్ట్రేలియా ప్రధానికి ఇండోనీసియా సూచన

బటేవియా, సెప్టెంబరు 12: ఇండోనీసియా రిపబ్లిక్ ప్రధాని డా॥ జ షరీర్, కొన్ని ముఖ్య రాజకీయాలను గురించి చర్చించే నిమిత్తం జోగ్‌జకర్తాకు తమ ప్రతినిధిని ఒకరిని పంపవలసిందని ఆస్ట్రేలియా ప్రధాని చిప్లీకి వర్తమానం చేశారు. ఈ విషయాన్ని రిపబ్లికన్ రేడియో ప్రకటించింది. ఇండోనీసియా విషయమై త్రైరాజ్య విచారణసంఘ స్థాపనను గురించి ఆస్ట్రేలియా ప్రభుత్వ ప్రతినిధితో రిపబ్లికన్ ప్రభుత్వం చర్చిస్తుంది. త్రైరాజ్య విచారణ సంఘంలో సభ్యత్వానికి సమ్మతించవలసిందని ఇండోనీసియా ఇటీవల ఆస్ట్రేలియాను కోరింది. త్రైరాజ్య విచారణసంఘాన్ని స్థాపించవలెననే నిర్ణయాన్ని ఆగస్టు 26-వ తేదీన ఐక్యరాజ్యసమితి భద్రతాసంఘం చేసింది.

## యూరప్ రాజ్యాల కస్టమ్సు యూనియన్

### మార్షల్ పథకం చర్చ: ఉపసంఘ నియామకం

లండన్, సెప్టెంబరు 12: యూరప్ రాజ్యాల కస్టమ్సు యూనియన్ ఏర్పరచటానికిగల అవకాశములను ఆలోచించటానికి ఒక ఉపసంఘమును నియమించుటకు కాను నిర్ణయించినట్లు మార్షల్ పథకంపై చర్చలలో పాల్గొన్న 16 రాజ్యములలో 13 రాజ్యములు ఈ రోజు రాత్రి ప్రకటించినవి. ఆ రాజ్యాలు: ఆస్ట్రియా, బెల్జియం, డెన్మార్క్, ఫ్రాన్సు, గ్రీస్, ఐస్‌లాండు, ఐర్లండు, ఇటలీ, లక్సెంబర్గ్, నెదర్లండ్సు, పోర్చుగల్, టర్కీ, బ్రిటన్.

ఈ ఉపసంఘమునకు కార్యకర్తలుగా బెల్జియం, లక్సెంబర్గు, నెదర్లాండ్సు దేశాలుండి, స్పెయిన్ గాక యూరప్‌తో సహా తక్కిన యూరప్ రాజ్యాలన్నిటిని యీ సమావేశమునకు ఆహ్వానిస్తారు. బ్రిటిషు సామ్రాజ్య దేశములు కూడా ఇష్టపడినట్లయితే ఈ సమావేశమునకు ఆహ్వానింపబడతవి. 16 రాజ్యాల సమావేశమునకు హాజరైన స్వీడన్, నార్వే, స్విట్జర్లాండు దేశాలు ఈ కస్టమ్సు యూనియన్ స్థాపన కష్టసాధ్యమని సూచిస్తున్నవి; కాని వానిని కూడా ఈ సమావేశమునకు ఆహ్వానింతురు.

మీకు 4 మాటలు చెప్పవలెనని చాలా కాలంగా అనుకుంటున్నాను. ఇంతకంటే అనువైన స్థితి, దేశంలో ఇంతకంటే సుఖప్రదమైన పరిస్థితులు ఏర్పడిన రోజున మీకు మంచి చెప్దామనుకున్నాను.

కాని విధివిధానం అన్యథా నిర్ణయమైంది. నోటిమాటలతో అభివర్ణించడానికి అలవికానట్టి విషాదపరిస్థితులలో ఈరాత్రి అతి బాధాకరమైనట్టి విధిని నిర్వర్తింపవలసివచ్చెను. అతి భారమైన హృదయంతో విధి హెచ్చరికను శిరసావహించి మీకు 4 మాటలు చెప్పడానికి నిర్ణయించుకొన్నాను.

మన చరిత్రలో అపూర్వమైన సంఘటనమును, దాదాపు ఒక మాసం రోజుల క్రితం మనమంతా అసమానమైన ఉత్సాహంతో, పట్టలేని సంతోషంలో, మహాపర్వదినంలాగా జరుపుకున్నాము. అదే మన కష్టార్జిత స్వాతంత్ర్యము. అయితే ఆనాటి మన సంతోషానికి యిప్పుడు కూడా పరాభృతమై ఉన్నది. కారణం? దేశంలో కొన్ని ప్రాంతములో జరుగుతూ ఉండిన విషాదసంఘటనలే. మానవుల భయకంపితులచేసే పైశాచిక కృత్యాలు, ఘాతుకాలు జరుగుతూవచ్చినవి. అవి జరిగిన పరిస్థితులనుబట్టి, ఆ కల్లోలం యితర ప్రాంతాలకు వ్యాప్తంకాకుండా చేయగలము, అల్లరుల కేవలం స్థానికంచేయగలమని ఆశించాము. కాని అత్రాపికల్లోలిత ప్రాంతం విస్తరించింది. స్త్రీలు, పురుషులు, పసిపాపలు అశేషంగా, అసంఖ్యాకంగా మరణిస్తున్నారు దానికి

(5—వ పేజి చూడుడు)

## పాటియాలాలో మతకలహ జ్వాలన

### వివిధప్రాంతాల్లో కలహాల పరిస్థితి

పాటియాలా, సెప్టెంబరు 12: పాటియాలాలో భిన్నమతవర్గాలకు తీవ్ర సంఘర్షణ ఏర్పడగా మిలిటరీ అధికారులు పరిస్థితి విషమించకుండా జాగ్రత్త పడిన దుర్ల 105 గురు మరణించారనీ మరి 80 మంది గాయపడ్డారనీ నేడు వెలువడిన అధికారిక ప్రకటన తెలుపుతోంది. ఇప్పుడు పరిస్థితి అదుపులోకి వచ్చిందట. అధిక సంఖ్యాకుల మధ్య అల్పసంఖ్యాకంగా ఉన్న మహమ్మదీయులు అందరినీ చేరదీసి బహదూర్‌ఘర్‌లో ఉంచి సంస్థాన ప్రభుత్వం వారికి ఉచితంగా వసతిసౌకర్యాలు కల్పిస్తోంది.

#### జలంధరు

జలంధరు, సెప్టెంబరు 12: జలంధరు కంటోన్మెంటు ప్రాంతంలో ఒక బాంబు పేలి 4 గురు చనిపోయారు అంబాలా సిటీ జిల్లాలో కొటకల్లా గ్రామ ప్రాంతాలు ఇంకా సంక్షుభితంగానే ఉన్నాయి. సిమ్లాలో లడాఖి మొహల్లావాసులు ఒక పూజామందిరంపై కాల్పులు సాగించడంలో ఎల్లీ కల్లోలం ప్రారంభమయింది. ఉభయవర్గాలవారి దుకాణాలు దోపిడీ చెయ్యబడ్డాయి. మొత్తంమీద జలంధరు జిల్లా ప్రశాంతంగానే ఉన్నది.

#### అమృతసర్

పాకిస్తాన్ నుండి ఇంతవరకూ తూర్పు పంజాబుకు 10 లక్షల మంది కాందిశీకులు వచ్చారని అధికారికంగా తెలిసింది.

బుధవారంనాడు కాలినడకన వెళ్తున్న కాందిశీకులపై సాయుధులైన దుండగులు దండెత్తినందువల్ల అమృతసర్ జిల్లా టంటరాన్‌లో 70 మంది చనిపోయారు. కాందిశీకుల వెంటనున్న మిలిటరీవారు చాలా మంది దుండగులను హతమార్చారు.

#### పశ్చిమ పంజాబు

రాష్ట్రము మొత్తంమీద పరిస్థితులు ప్రశాంతంగానే వున్నాయి. లాహోరు జిల్లా సరిహద్దులో వున్న గ్రామంపై 2 వందల సిక్కులు దండెత్తి వచ్చారనీ, మిలిటరీ అధికారులను చూచి పారిపోయారనీ, ఇటువంటి దాడయాత్రను యత్నించడం ఇదినాలుగోపర్యాయమనీ పశ్చిమపంజాబ్ ప్రజాసంబంధ కార్యాధ్యక్షుడు నేడుచేసిన పత్రికా ప్రకటనలో ఉన్నది.

లాయల్‌పూర్ నుండి 40 వేల సిక్కు కాందిశీకదళం ఒకటి తూర్పు పంజాబుకు కాలినడకన బయలుదేరింది.

పయాల్‌కోటలో స్థానిక డోగ్రా జాతివారు జమ్ముసైనికుల సహాయంతో ముస్లింలను ముట్టడించారు. దండెత్తివచ్చినవారిలో 30 మందిని పోలీసులు చంపివేశారు.

తూర్పు పంజాబు వివిధ ప్రాంతాల్లో ఉన్న ముస్లిం కాందిశీకులను సాధ్యమైనంత త్వరలో అక్కడినుంచి తీసుకువచ్చుటకు సకల ప్రయత్నాలూ చేస్తున్నామని పశ్చిమపంజాబ్ ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది.

## సిద్ధిఘట్టాలో పోలీసు కాల్పులు

### మైసూరులో సత్యాగ్రహ సంరంభం

బెంగుళూరు, సెప్టెంబరు 12: మైసూరు సంస్థానమునందలి వివిధ భాగములలో కాంగ్రెస్ కార్యకలాపముల విషయమై వచ్చుచున్నవార్తలను బట్టి సత్యాగ్రహము అనేక విధముల విజృంభించుచున్నట్లు తెలియుచున్నది. సత్యాగ్రహదళముల నేర్పాటు చేయుచున్నారు. ప్రభుత్వ కార్యాలయములను పికెట్టుచేయుచున్నారు, కల్లుతీయుటకు ఉపయోగపడు చెట్లను నాశనముచేయుచున్నారు, సంస్థానమందంతట అమలులోనున్న నిషేధాజ్ఞల నుల్లంఘించి ఊరేగింపులు సభలుచేయుచున్నారు.

భారత జాతీయ పతాకను ప్రతిష్ఠించుటకు ఒక జనసమూహము తాలూకా కచ్చేరీలోనికి చొరబడగా బెంగుళూరుకు 40 మైళ్ల దూరమునవున్న సిద్ధిఘట్టాలో నేటి మధ్యాహ్నము పోలీసులు తుపాకులు కాల్చిరి. వివరములు తెలియలేదు. బెంగుళూరునుండి చాలామంది పోలీసులు అచ్చటికి వెళ్లియున్నారు. సంస్థానపు తూర్పుననున్న దేవాన్‌గిరి, చిటాల్‌ద్రుగ్‌లలో అల్లకల్లోలముగా నుండుటచేత అచ్చటికి బెంగుళూరునుండి సైనికులు పంపబడిరి.

బెంగుళూరు కంటోన్మెంటులో నేటి మధ్యాహ్నము రెండు సత్యాగ్రహ దళములు బయలుదేరినవి. వీరిని పోలీసులు అరెస్టుచేసిరి. అరెస్టయినవారిలో కంటోన్మెంటు మునిసిపాలిటీ సభ్యుడు శ్రీ దీనదయాలు నాయుడుగారు కలరు. బెంగుళూరు నగరములో నేడు రెండు ఊరేగింపులు జరిపిరి. విద్యార్థినుల ఊరేగింపును చెల్లనిచ్చిరి. రెండవదానిని పోలీసులు చెదరగొట్టిరి. అరెస్టయినవారిని పోలీసులు దూరప్రదేశములకు తీసికొనివెళ్లి అచ్చట వదలిపెట్టిరి. సత్యాగ్రహులను సంస్థానము వెలుపల వదలిరని మాట, నిజముకాదని సంస్థానాధికారులనుచున్నారు. నగరములో అరెస్టయిన 25 మంది సత్యాగ్రహులకు నేడు 15 రోజులకు మించని కఠినశైదు లేదా జరిమానా విధింపబడినది.

మైసూరులో ఈ 14 న రాజభవనము కడ సత్యాగ్రహము జరగనుండుటచే వెలుపలివారు రాకుండా కట్టుదిట్టములు చేయబడినవి. వెలుపలినుండి సంస్థానములోనికి సత్యాగ్రహులు రాకుండ సరిహద్దులలో మిలిటరీవారు కాపలా కాయుచున్నారు.

అ. ప్రె.

#### చింతామణిలో అరెస్టులు

మదనపల్లి, సెప్టెంబరు 13: ఇచ్చటికి 30 మైళ్ల దూరములోనున్న చింతామణిలో మైసూరు ప్రజాప్రతినిధిసభ సభ్యుడు శ్రీ బి. మునస్వామప్ప, చింతామణి మునిసిపాలిటీ మాజీ అధ్యక్షుడు టి. ఎమ్. రంగయ్య, వినోభాభార్వే ఖాదీభాండార యజమాని శ్రీనివాసమూర్తి, మాజీ మునిసిపల్ కౌన్సిలరు శ్రీ హనుమిరెడ్డిగారలు, మైసూరు కాంగ్రెసువాదులు, నిన్న అరెస్టు కాబడిరి. నిన్న చింతామణిలో హర్తాళము జరిగెను విద్యార్థులు సమ్మె చేసిరి.

స్వ. వి.

చిన్న కథ

# "గగన కుసుమం"

శ్రీ వజ్ఝల రామనరసింహమ్

ఈ నలభైకోట్లమంది ప్రజలు నివసిస్తూవున్న ఈ దేశంలో, సత్యం తను ఎందుకు ఒంటరిగా వున్నాడో తనకే తెలియదు. అతనికి "నా" అన్నవారెవరూ లేరు. చిన్నప్పటినుంచీ కష్టాలు పడడం అతనికి అలవాటుగా మారిపోయింది.... కష్టం అనేది ఏదో అతిసామాన్యమైనవస్తువనుకుంటాడు...రోజూ—తనకు లభించిన—రెండుమూడు ట్యూషనులు చెప్పుకోవడం, ఇంటికివచ్చి వండుకుని తినడం, ఆతర్వాత ఏపార్కులోకో పోయి తన జీవితాన్ని ఒక్కమారు దీర్ఘంగా సింహావలోకనం చేసుకోవడం,—ఇదీ అతని దినచర్య! ఒక్కొక్కమారు అతని జీవితంమీద అతనికే అసహ్యం పుడుతుంది......ఒక్కొక్కమారు ఆశ్చర్యం కలుగుతుంది...మరొకమారు వింతైన జాలిపుడుతుంది!...

...సత్యం పెద్దచదువేదీ చదవలేదు... కాని, అతని తెలివితేటలు మోఘం...అనేక గ్రంథాలను చదివాడు...అనేక విషయాలను ఆలోచించాడు...అతనిలో ఎన్నో వ్యక్తప్రాప్తమైన భావాలు పరుగెడుతున్నాయి...

ట్యూషనులవల్ల లభించిన ఆసొమ్ముతో తను ఎల్లా కాలం గడుపుతున్నాడో అతనికి తెలియదు. జీవితానికి, ధనానికీ, ఏమిటీ సంబంధం? అని ప్రశ్నించుకుంటాడు....ప్రపంచ చరిత్ర అతనికి వింతగా కనిపిస్తుంది...ఒకనాడు తను మహారాజననుకుంటాడు...ఒకనాడు బిచ్చగాడిననుకుంటాడు!...రోజులు మాత్రం త్వరగా దొర్లిపోతున్నాయి అతని జీవితంలో... అప్పుడే, అతడు పాతిక మండువేసంగులను చూచాడు...

ఈ విధమైన జీవితంమీద అతనికి రోత జనిస్తున్నది...ఇలా, ప్రపంచంలో ఎన్నాళ్లు బ్రతుకగలను? అనుకున్నాడు.

ఏనాడు, "నేను భాషాసేవ చేస్తాను" అని అనుకున్నాడు. సత్యం! రెండు రోజులు ట్యూషనులు చెప్పడం మానివేసి, పదిపేజీల కథ ఒకటి రాశాడు. ఇన్నాళ్ళూ తనలోవున్న ఏవేవో భావాలను కాగితంమీదకి తీసుకువచ్చే అవకాశం, ఆ కథ రాస్తున్నప్పుడు అతనికికల్గింది...కథ రెండుమూడుమారులవ్వనలో చదువుకున్నాడు... ఎలావుందో, తనకి తెలియడంలేదు!

ఓనాడు పోస్టులో తన కథని "మంజరి" పత్రికకు పంపించాడు......తను ఆకథని ఎందుకు రాశాననుకున్నాడు...రోజూ తన కథని—తనుసృష్టించిన వింతకల్పనను గురించి ఆలోచించడం మొదలు పెట్టాడు ......ఆ కథ రాయడంవల్ల, తన కేమిటి లాభం! అది ప్రకటించబడుతుందా? ఏమో! ఆంధ్రులలో ఎంతమంది కథలు రాస్తూ, భాషాసేవ మీద బ్రతకలుగుతున్నారు??? ఈ పత్రికలన్నిటికీ, ప్రతీ వారమూ, ప్రతీపక్షమూ, ప్రతీ నెలా, కథలు ఎలా లభిస్తున్నాయి? ఎవరు రాస్తున్నారు? ఎందుకు రాస్తున్నారు? రాసినందువల్ల వారేమిటి ప్రతిఫలం పొందుతున్నారు? ఆ కథకులందరూ కథలు వ్రాయడం మానివేస్తే, ఈ పత్రికలన్నీ ఎలా నడుస్తాయి? భాషాసేవలో, పాఠకుల బాధ్యత ఏమిటి? ......ఈ ఆలోచనలన్నీ అతనికి ఎలా వచ్చాయో, అలాగే మాయమయాయి...

......నెలరోజులు గిర్రున తిరిగిపోయాయి...సత్యం పత్రిక కోసం ఎదురు చూస్తున్నాడు...తనకథ ఏమైందో!... పత్రిక అతనికి రాలేదు...కథ ప్రకటించబడలేదు అనుకున్నాడు...రెండురోజులు రాత్రింబగళ్లు కష్టపడి, వృధాగా, ఆ కథ తను రాసినందుకు తనను నిందించుకున్నాడు......

ఓనాడు, ట్యూషను చెపుతూవున్న వారింట్లో, ఆ నెల "మంజరి"పత్రిక సత్యంకి కనిపించింది...అప్రయత్నంగా, దానిని తీశాడు. మొదటి పుట తిరగవేశాడు...ఒక్కక్షణం ఆశ్చర్యపోయాడు ......మొదటి కథ తనదే!! గబగబా, తనకథని మొదలునుంచి కొసవరకూ ఒకమారు చదువుకున్నాడు...తన కథ ఎలావుందో ఇప్పుడతనికి తెలిసినట్లయింది...తన భావసంపద కితనే ఆశ్చర్యపడ్డాడు...కాని, తనకు పత్రిక ఎందుకు రాలేదు?? పత్రిక ఎందుకు రాలేదు???

మర్నాడు, సత్యం, బుక్‌స్టాల్ వద్దకి వెళ్లేడు; "మంజరి" పత్రిక తీశాడు...వెల పావలా...కొనడమా, మానడమా? తన జేబులో సమంగా పావలా వుంది...ఏమిటి చేయడం?.. తను కథ ఎందుకు రాశాడు? తప్పదు...కొనితీరాలి...ఎంతో కష్టపడుతూ, పావలాయిచ్చి, "మంజరి" నతీశాడు...

సత్యం ఇప్పుడు తరుచుగా కథలురాసి పత్రికలకి పంపుతున్నాడు...అతని కథలు చాలా ప్రకటింపబడ్డాయి...ఇప్పుడు అతనికి కొన్నిపత్రికల కాపీలు వుచితంగానే వస్తున్నాయి...(కొన్ని మాత్రమే. ;)... సత్యం తనలోవున్న శక్తిని కనుగొన్నాడు ...తనలో ఏదో—ఇన్నాళ్ళయి దాగునివున్న—మహత్తరమైన ప్రజ్ఞ, శక్తి, గొప్ప ఆదర్శభావాలు, వున్నాయనుకున్నాడు... తనకి ప్రత్యక్షంగా ఏటువంటి వుపయోగమూ లేకపోయినా, కథారచన సాగిస్తున్నాడు...

సత్యం యిప్పుడు గొప్ప కథకుడు... అతని కథారచన నూతన శైలిలో, ఇంతవరకూ ఎవడూ ఎరుగని నూతన ఫక్కీలో నడుస్తున్నది...

అతడు పేరుపొందినకథకుడయాడు...అంతే, అతని కథలను పత్రికలు కళ్లకి అద్దుకుని ప్రకటిస్తాయి...అతని అదృష్టముంటే, అతనికొక కాంప్లిమెంటరీ కాపీ వస్తుంది కూడా! అంతే...!

సత్యం ఒక చిన్న నవలని రాసి, ఓ పత్రికకు పంపించాడు. ఆ నవల, వరుసగా ఆ పత్రికలో కొన్ని సంచికలలో పడింది. ఓనాడు సత్యం తనలోతాను అనుకున్నాడు—తను కేవలం ఒక రచయితగా బ్రతుకుతే?! కాని, అది ఎంతవరకు సాధ్యమో అతడికి వూహ తట్టలేదు... ...ఈమధ్య తన జీవితం ఎలామారింది! అని ఆశ్చర్యపోయాడు...తను రచయితగా మారుతాడని ఎన్నడూ అనుకోలేదు... ఎందుకో, తనకు ఈ రచనమీద ఒకవిధమైన వుత్సాహం కలుగుతున్నది...తన మనసుమాత్రం దేనినో ఆశిస్తున్నట్టుంది...

సత్యం బ్రహ్మాండమైన ఒక నవలను రాయడం ప్రారంభించాడు... రోజల్లా నవలారచనమీదనే గడుపుతున్నాడు... తన ట్యూషనులమీద శ్రద్ధ తగ్గిపోయింది... ఒకనాడు ఆట్యూషనులు చక్కా ఎగిరిపోయి వూరుకున్నాయి...ఇంక తన బ్రతుకంతా గ్రంథ రచనమీదేవుంది... నవల పూర్తికావచ్చింది...

ఒకనాడు సత్యంకి జ్వరం వచ్చింది... అది క్రమంగా మలేరియాలోకి దించింది... వారం రోజులైనా, జ్వరం తగ్గలేదు... సాక్షాత్తూ ఒక డాక్టరుని కుదుర్చుకున్నాడు ......మరోవారం గిర్రున తిరిగిపోయింది. ...ఈలోగా, సత్యంకి డబ్బు అవసరం ఎంతో కల్గింది... డబ్బుకోసం చాలా ఇబ్బంది పడ్డాడు...తన ట్యూషనులైనా లేవు!

జ్వరం తగ్గేసరికి రమారమి నెలఅయింది ...ఈలోగా నవల ఎలాగో పూర్తిచేశాడు... డా॥ 50 రూపాయలకి బిల్లు పంపించాడు. ఎలా తీర్చడం ? యాభై రూపాయలు!! తన నవల జ్ఞాపకంవచ్చింది...

నవలని ఓ పత్రికకు పంపాడు. కాని, ఆ పత్రిక ధనసహాయం చేయలేదని తెలిసింది...తర్వాత, ఆ నవలను ఇద్దరు ముగ్గురు పబ్లిషర్సుకి పంపాడు. కాని అతడు ఆశించిందిమాత్రం లభించలేదు... ఆఖరికి ఆనవలను వీలైనంతడబ్బుకి, ఎంతవస్తే అంతకే—అమ్ముకోడానికి నిశ్చయించుకున్నాడు...ఓ పబ్లిషరు సమంగా 50 రూపాయలకి ఆ నవలను పూర్తిగాకొనడానికి ఎలాగో సమ్మతించాడు...ఆ నవలలో, ధనప్రపంచులను దోచుకొనే అవకాశం వుందని ఆ పబ్లిషరు గ్రహించాడు...

నవల నమ్మగావచ్చిన 50 రూ॥లుసత్యం డాక్టరు చేతుల్లో పోసి, వట్టి చేతులతో యింటికివచ్చి పడకకుర్చీలో కూలబడ్డాడు...తను రాత్రింబగళ్లు కష్టపడి, రక్తాన్ని ధారపోసి, రాసిన తన నవలవల్ల తనకేలాభమూ లేకపోయింది. వృత్తిసర్రిగా తన కాలాన్ని వృధాచేసుకున్నాడనిపించింది........గ్రంథరచన కేవలం ఒక వినోదం...దానిమీద ఏ ఆంధ్రుడూ ఇంతవరకూ ఆధారపడి సమంగా జీవించలేదనుకున్నాడు......

కాలం గడిచిపోతున్నాది...

సత్యం యిప్పుడు [illegible]కున్నాడు. కథలు, నవలలు, రాయడం ఇప్పుడు పూర్తిగా మానివేశాడు...పత్రికలు, ప్రపంచకం, యథావిధిగా సాగిపోతున్నాయి......

సత్యం, మళ్ళా, ఏవో రెండు ట్యూషనులు సంపాదించగలిగాడు! తన జీవితానికీ, ఈ ట్యూషనులకి ఏదో సన్నిహిత సంబంధం వుందనుకున్నాడు......

తను నవలారచన మీదే బ్రతుకుదామనుకున్న రోజులు జ్ఞప్తికి వచ్చినప్పుడెల్లా "[illegible] ఏమి లాభం!" అని అనుకుంటూ వుంటాడు సత్యం!

ఆంధ్రపత్రిక

ఒరు లేయవి యొనరించిన, వరవర యప్రియము తన మనంబున కగు, దా
నొరులకు నవి సేయకునికి, పరాయణము పరమధర్మపథములకెల్లన్. (మహాభారతము.)

1947-వ సం॥ సెప్టెంబరు నెల 14-వ తేది ఆదివారము

# రషియా - పరిషియా

ఉత్తర పరిషియా సోవియటు సరిహద్దున ఒక సంవత్సరముగా నున్న నిశ్చలతకు తిరిగి భంగము కలిగినది. ఉభయదేశములు యుద్ధ సన్నాహమున కనినట్లు సరిహద్దులకు సైన్యములను, మరఫిరంగులను, తదితర యుద్ధసామగ్రిని తరలించుచున్నట్లు వార్తలు వచ్చుచున్నవి.

గత సం॥రము ఏప్రిలున ఉత్తర పరిషియాయందు నూనె ఉత్పత్తినిగురించి చేసుకొనిన ఒడంబడికను ధ్రువపరచుటకు పర్షియన్ పార్లమెంటుకు వెంటనే సమర్పింప వలసినదిగ, రషియా పరిషియన్ ప్రభుత్వమునకు హెచ్చరిక చేసినది. ఒడంబడిక షరతులను, ఎట్టి మార్పులు లేక యథాతథముగా పార్లమెంటునందు ప్రవేశపెట్టవలె నని కూడ తెలియజేసినది.

పరిషియా కనుక ఆ ఒడంబడికకు కట్టుబడకపోయిన దానివల్ల కలుగు ఫలితములు పరిషియాకు ప్రమాదకరముగ నుండగలవని రష్యను పత్రిక ప్రావ్దా హెచ్చరిక చేసినది.

ఇది కేవలము బెదిరింపు తప్ప వేరుకాదు.

అసలు రష్యా ఒత్తిడివల్లనే ఈ ఒడంబడికకు పరిషియా అంగీకరించినది గాని, దానిని అభిలషించలేదు. ప్రజలుగాని, ప్రభుత్వము గాని దానికి అనుకూలురుగ లేరు.

ఒడంబడిక చేసుకొనిన ఆరుమాసములలో ఆమోదింపుకు తమ పార్లమెంటుకు సమర్పించెదనని పర్షియన్ ప్రధాని అంగీకరించియుండెను. కాని దేశీయులుకూడ తనతోపాటు దానికి విముఖులని తెలియును.

ఎన్నికలకని పార్లమెంటును రద్దుచేసెను. తిరిగి ఘవంసుల్తానే ప్రధాని అయ్యెను. కాబట్టి, ప్రథమముగా అంగీకరించిన ఒడంబడిక షరతులను మార్చి ఆమోదమునిమిత్తము, పార్లమెంటునందు ప్రతిపాదింప నిర్ణయించెను. రష్యాకుకూడ ఆ అంశమును తెలియజేసెను.

గతసంవత్సరం అజర్‌బైజాన్ చరిత్ర తిరిగి సంభవింపవచ్చును. కాని పర్షియా అప్పటికన్న బలవత్తర స్థితియందున్న దనవచ్చును. స్వసంపదను కాపాడుకొను ప్రయత్నములో పరిషియాకు అమెరికా సంపూర్ణ సహాయము నివ్వ సిద్ధముగా నున్నది. అమెరికా రాయబారి ఆ సంగతిని తెల్పియజేసెను.

అంతేగాక టర్కీ గ్రీసులు, బ్రిటన్ అమెరికాలకు అనుకూలముగ నున్నవి. ఇరాకునందు బ్రిటిషు సైన్యము లున్నవి. పాలెస్తీనా సమస్య, ఐక్యరాజ్య సమితిసంఘు నివేదికప్రకారము పరిష్కరించబడవచ్చును. దీనినిబట్టి సూయజు కాల్వ రక్షణనిమిత్తము ఈజిప్టునందు సేనల నుంచుకొనునట్లు ఐక్యరాజ్య సమితి సూచించవచ్చును.

లేకపోయిన సుడాను విభజనసమస్యను పెద్దచేసి అక్కడ సేనల నుంచగలదు. ఆ విధముగ మధ్య, సన్నిహిత, ప్రాచ్యసమస్య ప్రస్తుతమునకు బ్రిటనుకు పరిష్కరింపబడిన దనవచ్చును.

దానితో పెనవేసుకొనియున్న భారతసమస్యకూడ ముగిసినది.

కాబట్టి ఇక రష్యాతో ఎత్తులువేయుటకు సిద్ధపడి పరిషియాను బలపరచగలదు. లేకపోయిన పాలెస్తీనా విభజన, ఈజిప్టు అసంతృప్తి కొంతకాలము వరకు ఆరబు అలజడిని రేకెత్తించవచ్చును. దానిని చూచుకొనే రష్యా ఇప్పుడు తిరిగి ఒత్తిడిని ప్రారంభించిన దేమో?

అలాకాక ఇహరాను పత్రిక నిందవేసినట్లు వెనుక 1907 సం॥లో అనుకొనినట్లు రష్యా, బ్రిటనులు పరిషియాను తమ ఆధిపత్యమునకు రెండుగా ఎంచవచ్చును. తమ పార్లమెంటు తిరస్కరించినప్పటికి, రష్యాలో రాయబారములు సాగించవలసినదిగ బ్రిటిషు రాయబారి పరిషియన్ ప్రభుత్వమునకు సలహానిచ్చెను. అంతర్జాతీయ రాజకీయములందు ఏది సంభవించుటకైనను సాధ్యము.

పరిషియాను కబళింప బ్రిటిషు సింహము, రష్యను ఎలుగుబంటు కబళింపవలెనను ప్రయత్నము ఈ నాటిదికాదు. ఇపుడు అమెరికగద్దకూడ రంగమున ప్రవేశించినందువల్ల అది పూర్తిగ సాధ్యము కాదు.

అదీకాక గత సంవత్సరము ప్రతిపాదించిన పరిషియా రష్యా తగాదా సమస్య ఐక్యరాజ్య సమితి భద్రతాసంఘ కార్యక్రమములో యుండనేయున్నది.

ఇపుడు తిరిగి తలయెత్తిన తగాయిదా కొత్త సంఘటనలకు దారితీయవచ్చును. నిష్పాక్షికులగు ప్రపంచ ప్రజల సానుభూతి పరిషియా ఎడల యుండగలదు. తన సంపదను తన ఇష్టమువచ్చినట్లు వినియోగించుకొను ఏ దేశమునకు స్వతస్సిద్ధమైన హక్కున్నది. రషియా వైఖరి కేవలము అహంకారబద్ధమైనది.

## బొంబాయిరేవుకు ఆహార ధాన్యాల ఓడలరాక

బొంబై, సెప్టెంబరు 12: బొంబై రేవుకు ఆహారధాన్యాలతో మరికొన్ని ఓడలు చేరినవి. ఇందులో ఏడు పెద్దఓడలు, కొన్ని చిన్నపడవలు వున్నవి. గోధుమలు, గోధుమపిండి, బియ్యం, మైలో కలసి 50,991 టన్నుల ఆహారం వీటిలో వున్నది. బొంబై, గ్వాలియర్, మధ్య ఇండియా, బరోడా, గుజరాత్, హైదరాబాద్, రాజపుత్రస్థాన సంస్థానాలు, సి. పి. రాష్ట్రాలకు యీ ఆహారాన్ని పంచుతారని ఒక కేంద్రప్రభుత్వ ఉద్యోగి తెలియజేస్తున్నాడు. ఇవిగాక, ఇంకా 8 ఓడలు రేవులో తావులేక సమీప ప్రదేశంలో లంగరువేసి వున్నవి. ఆహారధాన్యాలను యెక్కించుకొని ఏడు ప్రత్యేక రైలుబండ్లు సెప్టెంబరు 13 న డిల్లీ చేరబోతున్నవి. ఈ వారాంతంలోపుగా ఇంకా రెండు రైలుబండ్లు చేరగలవు. నిజాం సంస్థానానికి రెండు ప్రత్యేకరైళ్లు ఆహారధాన్యంతో వెళ్లనున్నవి.

## ఢిల్లీ ఆహారసమావేశం వాయిదా

బొంబై, సెప్టెంబరు 12: అక్టోబరు నెలకు ఆహార పంపిణీవిషయమై సెప్టెంబరు 15వతేదీన ఢిల్లీలో ప్రత్యేక ఆహార సమావేశాన్ని జరుపవలెననుకున్నారు. ఇదివాయిదాపడినట్లు అధికార ప్రకటన తెలుపుతున్నది. సెప్టెంబరు 20 న ఈ సమావేశం బొంబై సెక్రటేరియెట్‌లో జరుగుతుంది.

## అంతర్జాతీయ బ్యాంకు సమావేశం

### యూరప్ రాజ్యాలకు అప్పు ఇవ్వరాదని అమెరికా దేశాల పట్టుదల

లండన్, సెప్టెంబర్ 12: అంతర్జాతీయ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి ద్వితీయ వార్షిక సమావేశమునకు హాజరైన లాటిన్ అమెరికా దేశాల ప్రతినిధులు యూరప్‌రాజ్యాలకు ఈ రెండుసంస్థలు యికముందు అప్పుపెట్టరాదని పట్టుపడుతున్నట్లు తెలుస్తున్నది.

మార్షల్ పథకంపై పారిస్‌లో జరుగుచున్న చర్చలు ఆగిపోయినవి కాబట్టి ఈ 16 రాజ్యాలు అప్పుపెట్టదగినవి కావని వారు వాదిస్తున్నారు. అమెరికా ఆర్థిక శాఖ సహాయ కార్యదర్శి స్లైటర్ ఈ రోజు సమావేశమునకు హాజరగునని ఆశించారు కాని ఆయన హాజరుకాలేదు.

యూరప్‌రాజ్యాలకు అప్పుయివ్వరాదని లాటిన్ అమెరికా దేశాల ప్రతినిధులు పట్టుపడుతున్నారనువార్త లండన్‌లో ఏ మాత్రమూ ఆశ్చర్యం కలిగించలేదని రాయిటర్ ఆర్థికవిలేఖరి సిడ్నీ గాంపెల్ వ్రాస్తున్నాడు.

1944 వ సం॥లో ప్రథమంగా బ్రెటన్‌వుడ్సులో సమావేశం జరిగినప్పటినుండి, ఈ బ్యాంకు సహాయంఅంతా యూరప్ రాజ్యాలకేచేసి, లాటిన్ అమెరికాకు సహాయపడదని ఈ ప్రతినిధులు ఆందోళన చేస్తూనేవున్నారు. ఈ బ్యాంకు పూర్తిపేరు "పునరుద్ధరణ, అభివృద్ధికొరకు అంతర్జాతీయ బ్యాంకు" అనివుండ. పునరుద్ధరణ ముఖ్యంగా యూరప్ రాజ్యము లలో జరగాలి. అభివృద్ధి లాటిన్ అమెరికా, ఆశియా, ఆఫ్రికాలలో జరగాలి. కాబట్టి ఈ బ్యాంకు సగం వారికీ, సగం వీరికీ సహాయం చేస్తూవుండాలని ఈ ప్రతినిధులు వాదిస్తున్నారు. ఇది గురించియే ఈ బ్యాంకు అధ్యక్షుడు మెక్లాయ్" పునరుద్ధరణకార్యం అతిత్వరలో యూరప్‌లో జరుగవలసియున్నా, ఆఫ్రికా, దూరప్రాచ్యం, ఆశియా, లాటిన్ అమెరికాల అభివృద్ధికొరకు కావలసిన సహాయంకూడా అత్యవసరమే" నన్నాడు.

# సంఘర్షణ లాపకపోతే భారతఖ్యాతి మట్టిపాలవుతుంది

## అపకారికి ఉపకారం చెయ్యడమే నిజమైన ప్రతీకారమని ప్రార్థనసభలో గాంధీజీ హితవు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 12: "రాబోయే తరాలవారు మీరు కష్టపడి సాధించుకొన్న స్వాతంత్ర్య భాగ్యాన్ని జీర్ణించుకోలేక పోగొట్టుకున్నారని ఆనిందుకు అవకాశ మివ్వకండి. మీరీ మతోన్మాదం వదులుకోక పోతే ప్రపంచదృష్టిలో భారత దేశ మహాఖ్యాతి మట్టిపాలవుతుందని జ్ఞాపక ముంచుకోండి" అని మహాత్మాగాంధీ నేటి సాయంకాలం ప్రార్థనసభలో ఉపన్యసిస్తూ హిందూ సిక్కు మహమ్మదీయులందరూ ఉన్మత్త చర్యలు ఆపివెయ్యాలని హెచ్చరించారు.

"హత్యలూ, దోపిడీలూ, గృహదహనాలూ చెయ్యడంవల్ల మీ మతాలనే మీరు నాశంచేస్తున్నారు. నాకు గూడా మతమంటే ఏమిటో తెలుసును గాని ఏమతమూ ఇటువంటి ఉన్మాదాన్ని బోధిస్తున్నట్లు నాకు తెలియదు. ఇస్లాం మతముకూడా ఇటువంటి అక్రమచర్యలను బోధించదు." అని కూడా మహాత్మాజీ ఉద్ఘాటించారు.

సరిహద్దురాష్ట్రంనుంచి పూర్వమంత్రి గిరిధరలాల్ పూరీ తమకొక తంతివార్త పంపుతూ అందులో ఆయననూ, ఆయన భార్యనూ వెంటనే సంరక్షించాలని అభ్యర్థించినట్లు తెలియజేసి మహాత్మాజీ ఇల్లా అన్నారు.

"ఇటువంటివార్తవింటే నాతలసిగ్గుతో వ్రేలాడిపోతోంది. అక్కడ ముస్లింలతోపాటు అందరు హిందువులనూ సిక్కులనూ సంరక్షించవలసినబాధ్యత అక్కడి ప్రభుత్వం మీదా, క్వాయిదే ఆజామ్‌మీదా ఉన్నది.

నేను సరిహద్దు రాష్ట్రాన్ని బాగా ఎరుగుదును. ఆ రాష్ట్రంలో కొన్ని వారాలపాటు పర్యటించాను. ఖానుసోదరుల ఆతిథ్యంతో అక్కడ చాలా కాలం సురక్షితంగా ఉన్నాను. అటువంటి రాష్ట్రంలో ఈనాడు హిందూ సిక్కులు బతకలేకుండా ఉన్నారంటే శోచనీయం. అయినప్పటికీ అక్కడి పరిస్థితులను విని ఇక్కడ మీరు కోపం తెచ్చుకోవడం వల్ల ప్రయోజనం లేదు. క్రోధంతో ప్రతీకారబుద్ధి జనిస్తుంది. ఆ ప్రతీకార బుద్ధే ఈనాడు మనం దేశంలో ప్రతిచోటా జరుగుతున్న అమానుష చర్యలకన్నింటికీ కారణం. ఢిల్లీలో జరిగిన సంఘటనలకు ఎక్కడో ప్రతీకారంచేస్తే మహమ్మదీయులకు లాభించేదేమిటి? సరిహద్దులోనూ పంజాబులోనూ తటస్థించిన ఘోరదురంతాలకు హిందూసిక్కులు మరొకచోట ప్రతీకార చర్యకు పూనుకుంటే వీరికి మాత్రం ఏంజరుగుతుంది? ఒకడుగాని, పదిమందిగాని ఉద్రేకంతో పిచ్చిపనులు చేసినంతమాత్రాన ప్రతివారూ గుడ్డిగా అదారి ననుసరించవలసిందేనా? దోపిడీలూ గృహదహనాలూ, హత్యలూ మొదలైన రాక్షసచర్యలు చెయ్యడం వల్ల మీమతాలనే మీరు నాశనం చేసుకుంటున్నారు.

నాకు మతమంటే ఏమిటో తెలుసని నానమ్మకం. కాని ఏమతమూ ఉన్మాదాన్ని బోధిస్తున్నట్లు నేనెరగను. ఇస్లాం మతం కూడా అంతే. ఈ అక్రమచర్యలను సర్వమత వర్గాలవారూ వెంటనే ఆపివెయ్యాలని నా ప్రార్థన.

మీతర్వాత పుట్టబోయే తరతరాల వారు మాపూర్వులు కష్టపడి స్వాతంత్ర్య భాగ్యాన్ని సంపాదించుకుని జీర్ణించుకోలేక పోగొట్టుకొన్నారని వాపోయేందుకు అవకాశం ఇవ్వకండి. ఈ ఉన్మత్తచర్యలను వెంటనే ఆపివెయ్యకపోతే భారతదేశ కీర్తి ప్రతిష్ఠలు ప్రపంచ దృష్టిలో మట్టిపాలవుతాయని జ్ఞాపక ముంచుకోండి."

తర్వాత గాంధీజీ జామ్మామసీదులో తాము చూచిన ముస్లింల దుర్భర పరిస్థితిని వివరీకరించారు.

"జామ్మా మసీదు ప్రపంచంలో అన్ని మసీదుల్లోనూ చాలా సుందరమైనది. కాని అటువంటి చోట ఈ నాడు ఎంతోమంది ముస్లిం స్త్రీ పురుషులు అన్నవస్త్రాలులేక అటు ఇటువస్తూ గాఢదుఃఖం అనుభవిస్తూ ఉంటే నా గుండె తరుక్కుపోయింది. వారిని ఓదార్చడానికి ఎన్నో విధాల ప్రయత్నించాను. మృత్యువు ఎప్పటికైనా ప్రతివారికీ రావలసిందే. చనిపోయినవారిని గూర్చి విచారించి ప్రయోజనంలేదు. ఈ దేశంలో భవిష్యత్ప్రజానీ కాన్పించటటినీ రక్షించవలసిన బాధ్యత ప్రతివారి మీదా ఉన్నది. నన్ను చూడడానికి రోజూ చాలామంది ముస్లిం స్నేహితులు వస్తున్నారు. మీమీ పరిస్థితులు మర్మం లేకుండా నాతో చెప్పవలసిందని వారికి సలహా ఇస్తున్నాను. ఢిల్లీలోగాని దేశంలో మరెక్కడగాని ముస్లింల జీవితం అపాయస్థితిలో ఉన్నదంటే అది చాలా శోచనీయమైన విషయం. ఎన్నెన్నో అవస్థలతో ఇన్నేళ్లు జీవించిన నాబోటి ముసలివాడిమాట వినండి. దుర్మార్గానికి దుర్మార్గం ప్రతీకారంకాదు. అటువంటి ప్రతీకారంవల్ల ఎవ్వరికీ ప్రయోజనంలేదు. అపకారికి ఉపకారం చెయ్యడమే నిజమైన ప్రతీకారం.

ఈనాడు చాలామంది ముస్లిం స్నేహితులు ముందుకువచ్చి శాంతిస్థాపనకై సహాయం చేస్తామంటున్నారు. కాని నేటి పరిస్థితులలో ఢిల్లీలో వారి సహాయాన్ని తీసుకోవడం చాలా ప్రమాదకరమనిపిస్తోంది."

హిందూ, సిక్కు, మహమ్మదీయులందరూ కల్లోలాలు ఆపివెయ్యాలని ప్రార్థిస్తూ రాతి గుండెలనుకూడా కదిలించివేసే మాటలలో గాంధీజీ ఇల్లా ఉద్బోధించారు.

"మీరంతా గతాన్ని మరిచిపొండి. వెనకపొందిన కష్టనష్టాలనే తలంచుకుంటూ కూర్చోక అన్యోన్య సహకారంతో అందరూ శాంతంగా జీవించాలని నిశ్చయించుకోండి. భారత సమాఖ్యలో ఉన్నందుకు మహమ్మదీయులు గర్వించాలి. త్రివర్ణపతాకానికి వారుకూడా హృదయపూర్వకంగా నమస్కరించాలి. వారి మతాన్ని వారు అనుసరించుకుంటే వారికే హిందువూ విరోధికాలేడు. అదే విధంగా హిందూ సిక్కులు శాంతికాముకులైన మహమ్మదీయులనందరనూ తమ మధ్యకు ఆహ్వానించాలి. ఇక్కడి ముస్లింలవద్ద మారణాయుధాలున్నాయని నాకు తెలిసింది. వారు వాటిని వెంటనే ప్రభుత్వానికి అప్పజెప్పివెయ్యాలి. అల్లాచేస్తే ప్రభుత్వంకూడా వారిమీద ఎటువంటిచర్యనూ తీసుకోదు. హిందూ సిక్కులుగూడా ఇదేవిధంగా చెయ్యాలి. పశ్చిమ పంజాబుప్రభుత్వం మహమ్మదీయులకు ఆయుధాలందజేస్తోందని నాకు కొందరు చెప్పారు. ఇదే నిజమయితే ఇంతకంటే అక్రమకార్యం మరొకటిలేదు. ముందు ముందు దీనివల్ల వారికే సర్వనాశన మవుతుంది. ఇటువంటి దొంగపని వెంటనే ఆగిపోవాలి. ఎక్కడైనా ఎవ్వరైనా సరే అనుమతిలేనిదే ఆయుధాలు ధరించడానికి వీలులేదు. మీరందరూ కృతనిశ్చయులై ఢిల్లీలో వెంటనే శాంతిని స్థాపించి ప్రాక్పశ్చిమ పంజాబులకు వెళ్ళడానికి నాకవకాశ మివ్వండి.

నే నెక్కడికివెళ్లినా చెప్పేదొక్కటే! ఢిల్లీప్రజలు తాత్కాలికంగా ఉన్మత్తులయ్యారేగాని ఇప్పుడు వారు స్వస్థులయ్యారని చెప్పుకోవడానికి అవకాశం కల్పించండి. నిద్రలో తలలు వంచుకున్న మీ ప్రధానమంత్రీ, ఉపప్రధానీ తిరిగి తలలు ఎత్తుకొనటానికి అవకాశం కల్పించండి. ఇక్కడి పరిస్థితులను చూచి ఈనాడు వారిరువురూ యెంతో వేదన పడుతున్నారు.

భారతజాతికి మహోన్నత నాగరకత ఉన్నది. ఈనాడు వచ్చిన స్వాతంత్ర్యం అమూల్యమైనది. దీన్ని రక్షించే బాధ్యత ప్రభుత్వమూ ప్రజలూ సంయుక్తంగా ధరించాలని జ్ఞాపకముంచుకోండి."

చివరకు గాంధీజీ తామూ డిక్టా మెహతాగారూ వెళ్లి రాష్ట్రీయ స్వయం సేవక సంఘంవారి సురువుతో జరిపిన సంభాషణనుగూర్చి చెప్పారు. ఆసంఘం ఈకల్లోలాలలో విపరీతంగా పాల్గొన్నదని గాంధీజీకి తెలియుగా ఆయనవెళ్లి సంఘ గురువును దర్శించారు. వారు తమ సంస్థకు ఎవ్వరి యెడలా విరోధంలేదనీ, ముస్లిములను చంపడానికే ఏర్పడలేదనీ, చేతనైనంతవరకు హిందూసంఘాన్ని రక్షించడానికి ఏర్పడిందనీ, కల్లోలాలలో ఈసంఘం పాల్గొన్నదన్న వార్త కేవలం అసత్యమనీ చెప్పి తమ అభిప్రాయాలను లోకానికి ప్రకటించవలసిందిగా గాంధీజీని కోరారట.

## 'కవికోకిల' రామిరెడ్డిగారు

'కవికోకిల' శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి మరణవార్త యావదాంధ్ర సాహితీ ప్రపంచమును విషాదమున ముంచివేయగలదు. వారిమృతి ఆంధ్ర సాహిత్యాభివృద్ధికి పెద్ద అఘాతము.

'పానశాల', 'కృషీవలుడు' 'జలదాంగన' మొదలైన మృదుమధుర కావ్యములతో తదితర రచనలతో శ్రీ రామిరెడ్డిగారు ఆంధ్ర సాహితీ ప్రపంచమునకు కమ్మని ఆమెతలను కల్పించిరి. రామిరెడ్డిగారు, సరసుడు, సజ్జనుడు, విశాల హృదయుడు, నిరాడంబరుడు.

కవికోకిల అనుబిరుదు వీరికి అన్నివిధముల సార్థకమై ఒప్పినది. వారి కవితరూపము ప్రాచీనమైనదైననూ, భావము నవీనము. ప్రాచీన అర్వాచీన సమన్వయమునకు చక్కని తార్కాణమై ప్రత్యేక ప్రజ్ఞా, ప్రతిభాబద్ధమైనది, పదాడంబరరహితమై, మార్దవ మాధుర్యములైన జాతీయపదములతో వీరికవిత ప్రకాశించినది! "కృషీవల" సహజమైన నిరాడంబరత్వము, సౌందర్యము ఆయన కవిత నంటినట్లే, ఆయననుకూడ అంటియుండెడివి. ఆయన మృతి మాకు ప్రత్యేక విషాదకారణము. ఆదినుండీ వారికి మా పత్రికలతో సాన్నిహిత్య ముండెడిది. వారి పానశాల ప్రప్రథమమున మా భారతియందు వెలువడినది. ఒక సన్నిహిత మిత్రుని కోల్పోయితిమి. ఇట్టి మిత్రుని మృతికి వగచుచూ వారి కుటుంబమునకు మా సానుభూతిని తెలుపుచున్నాము.

## మైసూరు సంస్కరణలు

బెంగుళూరు, సెప్టెంబరు 12: మైసూరు దివాను సమావేశపరచిన సమాలోచనసంఘమువారు తయారుచేసిన నూతన రాజ్యాంగ విధాన ప్రధానాంశములను మైసూరుప్రభుత్వమువారు ప్రకటించుచున్నారు:

ఈ రాజ్యాంగవిధానము ననుసరించి మైసూరులో రెండు శాసనసభ లుండును. క్రిందిసభలో అనగా ప్రజాప్రతినిధిసభలో సభ్యులందరు ప్రజలచే ఎన్నుకొనబడినవారుగా నుందురు. ఆర్థికవిషయములలో దీనికి సంపూర్ణాధికారము లుండును. పెద్దసభలో కొందరు ప్రజానియోజితసభ్యులు, కొందరు ప్రభుత్వనియోజితసభ్యులు వుందురు. ఏశాసనమైనను రెండుసభల ఆమోదమును పొందినకరువాత మహారాజా గారి అంగీకారము పొందవలెను.

(2) కార్యనిర్వాహకవర్గము: శాసనసభయందలి ప్రజానియోజితసభ్యులనుండి మంత్రులను ఎంచుకొనవలెను. మహారాజు అర్హులైనవారి సలహా గైకొన్న మీదట మంత్రివర్గము నేర్పరచును. మంత్రులు సమష్టిగా వ్యవహరించెదరు. సమష్టిగా శాసనసభకు బాధ్యులైయుందురు. శాసనసభవారు విశ్వాసరాహిత్యతీర్మానము గావించినయెడల వారు తొలగింపబడుదురు. మంత్రులను ఎంచుకొనుటలో వివిధ సంఘములవారి హక్కులు ముఖ్యముగా పెద్దుల్లుతరగతుల హక్కులు గమనింపబడవలెనని సమాలోచకసంఘమువారి దృఢాభిప్రాయమై యున్నది.

(3) వోటింగు హక్కు: వయోజను లందరికి వోటింగుహక్కు వుండవలెనా లేక యిప్పటికంటె యెక్కువమందికి వోటింగు హక్కు వుండవలెనా అను విషయమును సమాలోచకసంఘమువారు విచారించిరి. ఈ విషయమును యింకా చర్చించవలెనని సభవారు అభిప్రాయపడిరి. ఇప్పటికంటె యెక్కువమందికి వోటింగు అధికారము వుండవలెనని, ఈ అధికారము ఆస్తి, ఇతర అర్హతలపై ఆధారపడవలెనని సభలో అత్యధిక సంఖ్యాకులు అభిప్రాయపడిరి. అభ్యర్థుల యోగ్యతలకు, వోటర్ల యోగ్యతలకు కొంతభేదము వుండవలెనని కమిటీవారు తలచిరి.

వోటింగుపద్ధతి: తమకు ప్రత్యేకనియోజకవర్గములు కావలెనని, తమకు అభిమానం చూపవలెనని ముస్లిములు, భారత క్రైస్తవులు, నిమ్నజాతుల ప్రతినిధులు కోరిరి. ఈ రెండు అనవసరమని, స్థానముల ప్రత్యేకింపుతోకూడిన సమష్టి నియోజకవర్గములు మైనారిటీల భయములను తొలగింపగలవని యితరులు తలచిరి. అన్ని సంఘములవారి సమ్మతితో ఈ విషయమును పరిష్కరింపవలెనని తలపబడెను.

ప్రాథమిక హక్కుల సమస్యను ప్రత్యేక ప్రతినిధుల సంఘము విచారింపవలెనని సభవారు అభిప్రాయపడిరి.

హైకోర్టు జడ్జీలను, ఆడిటర్ జనరలును, పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులను నియమించు విషయమున మహారాజుకు ఇప్పుడున్న అధికారములు ముందుగూడ నుండవలెనని సమాలోచక సంఘమువారు తలచిరి. మిలిటరీ మహారాజు క్రిందనుండును. రాజ్యాంగ విధానము స్తంభించినప్పుడు చర్యగైకొనుటకు వారికి అత్యవసరాధికారములు నుండును శాసన సభలను సమావేశపరచు, వాయిదావేయు, రద్దుచేయు అధికారము మామూలు మాదిరిగా ఆయన కుండును. రాజభవన వ్యవహారములు, రాజుగారి స్వంత ఖజానా శాసనసభ వారికోటుకు లోబడి యుండవు మైసూరు భారత అధినివేశ రాజ్యాంగ సంబంధములు మహారాజు గారి అధీనమునందుండును. మైనారిటీల హక్కులను రక్షించు బాధ్యత ఆయనపై వుండును. (అ. ప్రె.)

## ఇండియా ప్రభుత్వ చాకచక్యం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 12: బ్రిటిషుప్రభుత్వంలో బర్మామంత్రి లార్డు లిస్టోవెల్ ఈ రోజు ఇక్కడినుంచి విమానంలో కరాచీకి వెళ్లాడు. ఇటీవల విమాన ప్రమాదంలో స్వల్పంగా గాయపడి, ఇప్పుడు పునరారోగ్యం పొందుతున్న జగజీవన్‌రాం గారిని లార్డు లిస్టోవెల్ చూశాడు.

అశాంతిని, అల్లకల్లోలాలను అణచడానికి ఇండియా ప్రభుత్వం చూపుతున్న చాకచక్యాన్ని లిస్టోవెల్ ఎంతో అభినందించాడు. ఇండియా ప్రభుత్వం శక్తివంతంగా పనిచేసినందునే అశాంతి సద్దుమణిగి, మామూలు పరిస్థితి ఏర్పడుతున్నదని కూడా ఇతడు అన్నాడు. ఈ నాడు బర్మాప్రజలు బ్రిటిషువారి యెడల అపూర్వస్నేహభావాన్ని చూపుతున్నారని లిస్టోవెల్ తెలియజేశాడు.

## జమీందార్లకు నష్ట పరిహారము

చెన్నపురి, సెప్టెంబరు 13: ప్రభుత్వం స్వాధీనంచేసుకొననున్న ఎస్టేటులు, ఈనాము అగ్రహారములకు రు 25000 కు తక్కువకాకుండాను, రు 15 లక్షలకు మించకుండాను నష్టపరిహారం ఇవ్వడానికి చెన్నరాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించినట్లు తెలుస్తున్నది. సమీపకాలములోని రైతువారీ భూముల ఆదాయాన్నిబట్టి వానికి నష్టపరిహార మొత్తములను నిర్ణయించుచున్నారు. అయితే ఈ మొత్తములలో ఏసెలకంటును నీటి వసతులు, మరమ్మతులు తదితర ఖర్చులక్రింద మినహాయించగలరు.

నష్టపరిహారం దానాపు ఈ క్రిందరీతిగా నిర్ణయించబడవచ్చును.

సాలీనా రు 1000 కు లోపు ఆదాయం గలవారికి రు 25 010 ను, రు 1,000 కు మించి, రు 3,000 లోపు సాలు ఆదాయం గలవారికి రు 25,000 కాని లేక సాలు ఆదాయమునకు 22½ రెట్లును రు 3,000 కు మించి 20,000 కు లోబడిన సాలు ఆదాయము గలవారికి రు 67,500 సాలు ఆదాయమునకు 20 రెట్లును, రు 20,000 పైన రు 50,000 కు లోబడిన సాలు ఆదాయం గలవారికి రు 4 లక్షలు లేక సాలు ఆదాయముపై 17½ రెట్లును, రు 50,000 పైన రు 1 లక్షకు లోబడిన సాలు ఆదాయము గలవారికి రు 8,75,000 లేక సాలు ఆదాయముపై 15 రెట్లును, లక్ష రూపాయలకుపైబడిన సాలు ఆదాయం గలవారికి రు 15 లక్షలు లేక సాలు ఆదాయముపై 12½ రెట్లను నష్టపరిహారమిచ్చుటకు నిర్ణయించినారట. పైన సూచించబడిన 2 పద్ధతులలో ఏది ఎక్కువగా ఉన్న ఆ పద్ధతిని జమీందార్లకు నష్టపరిహారం ఇవ్వగలరు.

సాలు ఆదాయమును నిర్ణయించుటలో తగవులేర్పడినచో పరిష్కరించు నిమిత్తం జిల్లాకలెక్టరు, న్యాయశాఖాధీశులు, జమీందారుచే ఎన్నుకొనబడిన వ్యక్తి మొత్తం ముగ్గురిని చేర్చి న్యాయస్థానములను నియమించగలరు. రైతువారీ రేట్లు సంస్కరణ జరిగేలోగా ప్రస్తుతపు రేటు ననుసరించి నష్టపరిహారములను నిర్ణయించి, సాలీనాకొరకు కొంత ధనమును ప్రభుత్వానికి ఇవ్వగలరు.

## "జమీందారులకు పరిహారం ఇవ్వరాదు"

చెన్నపట్నం, సెప్టెంబరు 13: ఆంధ్రరాష్ట్ర రైతుసంఘంవారు శ్రీ నడూరి ప్రసాదరావుగారి అధ్యక్షమున నేడు రెవెన్యూమంత్రి కళా వెంకట్రావుగారిని సందర్శించి జమీందారులకు పరిహారం ఇవ్వరాదని తెలిపిరి. సర్వే సెటిల్మెంట్లకగు ఖర్చులు వారివద్దనే వసూలు చెయ్యవలెనని తెలిపిరి. 20 రెట్లు 25 రెట్లు పరిహారమిచ్చుట అన్యాయమనిరి. ముక్కామల నాగభూషణం, కొల్లా వెంకయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, వై. వి. కృష్ణారావుగారలు, ఆంధ్రరాష్ట్రములోని ఆయా జిల్లాలనుంచి ప్రతినిధులు వచ్చిరి. బిల్లు ప్రచురించువరకు ఆగవలసిందని, తర్వాత మరల రావలసిందని మంత్రిగారు హితవొసంగినటుల తెలియుచున్నది.

## పెషావర్‌లో అల్లర్లు

### కోహట్ కొండజాతుల దుర్మార్గం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 12: పెషావర్‌లో తిరిగి మతకలహ అశాంతి విజృంభించినట్లు ఇక్కడికి వచ్చిన వార్తలు తెలుపుతున్నవి. కోహట్‌నుంచి కొందరు కొండజాతివారు సరిహద్దు దాటివచ్చి పెషావర్ కంటోన్మెంటు ప్రాంతంపై దాడిచేశారు. చాలామంది హతులైనట్లు, ఆస్తిని కొల్లగొట్టినట్లు, స్త్రీలను అపహరించినట్లు తెలుస్తున్నది. బాబుమొహల్లా, సర్దార్ బజార్, ఆర్బాబ్‌రోడు, చౌక్ యాద్గార్, ధాన్యం మార్కెటు మొదలైన చోట్ల ఈ అల్లర్లు జరిగినవి.

దుండగీళ్లు మోటారు లారీలలోవచ్చి, కొల్లగొట్టిన సామగ్రితో లారీలను నింపుకొని వెళ్లిపోయినారని తెలుస్తున్నది. అల్పసంఖ్యాకవర్గానికి చెందిన ప్రభుత్వోద్యోగులను చాలామందిని చంపివేశారట. స్థానిక ముస్లిం సేనలుగార్డ్సు కూడా ఈ అల్లరులలో పాల్గొన్నారు. యు. ప్రె.

## గాంధి జన్మదినం సెలవు

మదరాసు ప్రభుత్వంవారు అక్టోబరు 2 వ తేదీ గాంధిమహాత్ముని జన్మదినమగుటచే సెలవుదినముగా ప్రకటింప నిశ్చయించిరి.

శరత్ చంద్రబోస్‌గారు ఆదివారం ఉదయం కలకత్తా మెయిల్లో మద్రాసు వస్తున్నారు.

### బియ్యం కేసులు

ఎగ్మూరురైల్వేపోలీసువారు మదరాసు నగరంలోకి 500 వడుల బియ్యం దొంగతనంగా తెస్తున్న ప్రయాణీకులు 50 మందిని పుకవారం అరెస్టుచేసిరి.

# వార ఫలాలు

**శ్రీ రావినూతల ఆంజనేయులు**

[లగ్న ఫలములను జన్మలగ్న, చంద్ర (గోచార) లగ్నములననుసరించి గ్రహించు నది. దశాభుక్తుల ననుసరించి ఫలితములు మారవచ్చును. కాన వరమ ప్రమాణములుగ నెంచరాదు.]

సెప్టెంబరు వ 14 తేదీ మొదలు
సెప్టెంబరు 20 వ తేదీ వరకు

## గ్రహ స్థితి

రవి, 17 నుండి బుధ శుక్రులూ (కన్య) కుజుడు (మిథునం 20 నుండి కటకం) గురువు (తుల 17 నుండి వృశ్చికం) శని (కటకం) రాహువు (వృషభం) చంద్రుడు (సింహ కన్య, తుల, వృశ్చికం లో) 15 రాహు చంద్ర, శుక్రరాహు (కోణం) 16 బుధ చంద్రుల (కలయిక) శుక్ర-ఇంద్ర (కేంద్రం) 17 కుజ చంద్ర (కేంద్రం) 18 బుధ, వరుణుల (కలయిక) 19 ర.. రాహు (కోణం) శనిచంద్ర (కేంద్రం) గురుచంద్రుల (కలయిక) 20 కు జ గు గ (కోణం)

## ధరలు

**ప్రత్తి(జారిల్లా) నూలూ-వస్త్రాలూ**

ముఖ్య గృహముల (కుజ, గురు, శుక్ర) రాశిచలనం మార్కెట్టులో మందికి కారణం-కొత్తవాయిదా కొనడం మంచిదికాదు. వీలయితే స్వల్పంగా అమ్మండి.

**వెండి-బంగారాలు**

చలామణీ తీవ్రంగా యుంటుంది. మార్కెట్టు కొంచెం ఎక్కువగా పడే సూచనలున్నవి.

**వాటాలు**

మార్కెట్టులో ఇంకా అభివృద్ధి సూచనలు లేవు. జాగ్రత్త.

**ధాన్యములు-ఆహారవస్తువులు**

అన్ని వస్తువులు ఇంచుమించు క్రిందటి వారంలో లాగే నిలకడగా వుంటవి.

## లగ్న ఫలాలు

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1 పాదం)

ఈ వారంలో గ్రహ సంచారం అనుకూల స్థానాల్లోనే ఉండడంవల్ల ఆరోగ్యాభివృద్ధి, ముఖ్య వ్యవహారాల్లో తృప్తికరమైన అనుకూలత, స్వల్ప కృషి అంతుకు మించిన ఫలితం కలుగుతవి. గొప్పవారితో పరిచయం ఏర్పడుతుంది. ప్రజాభావ్యక్తత తీవ్రంగా యుంటుంది. సాంఘిక కార్యాలూ, కుటుంబ పరిస్థితులూ, జరుగనివ్వవు. 15, 16 పరిష్కారాలకూ, 17, 18 ముఖ్యులను కలవడానికీ అనుకూలం.

**వృషభం** (కృత్తిక 2, 3, 4, రోహిణి మృగశిర 1 2 పాదాలు)

ఈ వారంలో లగ్నాధిపతి నీచరాశి సంచారం రవి బుధులకు మధ్య సుఖాన్ని కలుగనివ్వదు. పరిస్థితులు అన్నీ అనుకూలించునట్లు అగపడడం, పర్యవసానం నిష్ఫలంగాని, స్వల్పఫలంగాని కలుగ గలదు. ధనాదాయానికి మించి ఖర్చులు పెరుగుతవి. చట్టావ్యవహారాలకూ, పేకాటలకూ దిగవద్దు. 17, 18, 19 ల్లో చరస్థిర పరిష్కారాలు లాభకరం. వారాంతంలో చిన్న ప్రయాణం లేక ఆప్త సమాగమం సంతోషం కలిగించగలవు.

**మిథునం** (మృగశిర 3, 4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఈవారంలో మీ లగ్నాధిపతి ఉచ్చ సంచారం శుభాధిక్యతను సూచిస్తుంది. మిత్రసహాయంవల్ల తలపెట్టిన కార్యాలను సులభంగా నెరవేర్చుకొనగలుగుతారు. ఉద్యోగనాకరీలలో మార్పులను గురించి కొంత ఆతురత కల్గుతుంది. ఆహారఆరోగ్య పరిస్థితులు గత వారంలోకన్న మేలుగా యుండగలవు. 15, 16 ప్రయాణానికీ, ఆప్తులతో ముచ్చటింపులకూ 19, 20 ముఖ్య పరిష్కారాలకూ, వ్రాతల ముగింపులకూ అనుకూలం.

**కర్కాటకం** (పునర్వసు 4, పుష్యమి, ఆశ్లేష)

ఈవారంలో ముఖ్య గ్రహరాశి సంచలనం మీకు అన్నివిధాలా యోగిస్తుంది. అన్నిటికన్నా గురువు శుభస్థానంలో చేరి మీ చిక్కులను తొలగించడానికి అనుకూలించగలడు. ప్రతికక్షులసంఖ్య క్రమేణా తగ్గిపోతుంది. ఆర్థికంగా అనుకూలపరిస్థితులు హెచ్చుతవి. ధనవ్యయం కొంత ఎక్కువైనా కోర్టుకచ్చేరీ వ్యవహారాలలో రాజీ కోరుకోవడం మంచిది. ప్రయాణం సాగవు. 15, 16, 17 ల్లో ముఖ్యపరిష్కారాలు ముగించుకొనడం మంచిది. వారాంతంలో సమాజంలో కలహాలు, పేకాటలలో నష్టంకలిగే సూచన కలవు

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం)

ఈవారంలో ముఖ్యగ్రహబలం అంతా ఇరువైపులా ఉండడంవల్ల ఫలితం ఇంచుమించు సమానంగా యుంటుంది. గురురాశి సంచార శుభకార్యప్రయత్నాలకు ఆటంకం కలిగించకలదు. భాగ్యంలో చేసిన పనులను ఇతరులకు వప్పగించడం కాని, ఇతరుల కార్యభారం తలపై వేసుకొనడం కాని వద్దు. భార్యా బిడ్డల ఆరోగ్యం తృప్తికరంకాదు. ఉద్యోగ నాకరీల్లో అతృప్తి నిరుత్సాహం కలిగే సూచన లున్నవి. 14 ప్రయాణం, ఆప్తసందర్శనం 17, 18 ల్లో పరిష్కారాలు లాభకరం.

**కన్య** (ఉత్తర 2, 3, 4 పాదాలు హస్త చిత్త 1, 2 పాదాలు)

ఈ వారంలో లగ్నంలో తృతీయ లాభాల్లోనే గ్రహబలా ఉంటుంది. ఇంట, బయట, మీ మాటకు ఎదురేమీయుండదు. కాని డబ్బు విశేషంగా ఖర్చవడం కృషి ఉద్యమాల్లో స్తంభన, భయసందేహాలకు కారణం కాగలవు అదృష్టవశాత్తు గొప్పవారి సహాయంతో ఎక్కువకాలం గడుపుతారు. మీ ఆరోగ్యం తృప్తికరంగా యుండదు. అధికారులవల్ల ప్రతికూలతను సందేహించడంవల్ల ఉద్యోగ నాకరీల్లో చికాకు కల్గుతుంది. 20 శుభవార్త.

**తుల** (చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పాదాలు)

ఈవారంలో ముఖ్య గ్రహరాశి చలనం మీ కృషి ఉద్యమాల్లో క్రొత్త మార్పును సూచిస్తుంది ఇంతవరకూ మీరు చర్చించి నిర్ణయించిన వ్యవహారాల్లో కూడా మార్పు అవసరం అని గ్రహించకల్గుతారు. విశ్రాంతిలేని కార్యభారంతో ఎక్కువ కాలం గడిచే సూచనలున్నవి. ఉద్యోగ నాకరీల్లో మార్పులకై యోచిస్తారు. కాని మరికొంత కాలం ఆగవలసి యుంటుంది. కోర్టు కచేరీ వ్యవహారాలూ, పైవారానికి మార్చుకోండి. 17, 18, 19 ప్రయాణం, ఆప్తసమాగమం, విందు వినోదాలు.

**వృశ్చికం** (విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

ఈ వారంలో లగ్నాధిపతి భాగ్యంలో ధనాధిపతి లగ్నంలో ప్రవేశిస్తారు. ఈ మార్పు క్రమేణా శుభత్వాన్ని సూచిస్తుంది. కుటుంబ ఆర్థిక పరిస్థితులలో అనుకూల పరిస్థితులు కలుగుతవి. ఇంతవరకు మీకు వ్యతిరేకులుగా ఉన్నవారు అనుకూలురౌతారు. ఉద్యోగ నాకరీల్లో గౌరవాధిక్యత కలుగుతుంది. డబ్బు చేతికి వస్తుంది కాని శుభసంతోషకార్యాల పేరుతో అధికంగా వ్యయం అవుతుంది. 15, 16 ముఖ్య పరిష్కారాలకూ 19, 20 ప్రయాణానికీ, ఆప్తులనుకలవడానికి మేలు.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం.)

ఈ వారంలో కుజ, గురు సంచలనం ఉత్తరోత్తరా అత్యంత జాగ్రత్తను సూచిస్తుంది. కొన్ని మాసాలవరకూ స్పెక్యులేషన్ ఆడడం, వ్యాపారాల్లో జాగ్రత్త అవసరం. సంసారంలో చిక్కులు సంతోషభంగం కలిగించకలవు. దేహారోగ్యం కూడా తృప్తికరంగా యుండదు. శుభకార్యాలపేరుతో డబ్బు ఖర్చు అవుతుంది. శుభలేని ప్రయాణం జరుపవలసియుంటుంది. కాని విశ్రాంతియుండదు. 15, 16 చిన్న ప్రయాణం, ఆప్తులను కలవడం 17, 18 ముఖ్య పరిష్కారాలూ లాభకరం 16 శుభవార్త.

**మకరం** (ఉత్తరాషాఢ, 2,3,4 పాదాలు శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు.)

ఈ వారంలో మీరు 16 సాయంత్రం వరకూ ఆరోగ్య విషయంలో అత్యంత జాగ్రత్త వహించడం అవసరం. కృషి ఉద్యమాల్లోకూడా అనుకూల మార్గంలో ఉన్నా పరిస్థితులు వికలమౌతవి. డబ్బు చేతికి వస్తుంది. కాని నిలువదు. ఇతరుల పై ఆధారపడి గొప్ప వ్యాపారాలేమీ జరుపవద్దు. 17, 18 ల్లో ముఖ్య బంధువులు ఇంటికి రావడం విందు వినోదాలతో కాలం గడుస్తుంది. పరిష్కారాలేమీ వద్దు.

**కుంభం** (ధనిష్ఠ 3, 4 పాదాలు శతభిష. పూర్వాభాద్ర 1, 2, 3, పాదాలు)

ఈ వారంలో 19 వ మధ్యాహ్నం వరకూ ఓర్పుతో పరిస్థితులను గమనించడం అవసరం. ముఖ్య పరిష్కారాలూ ప్రయాణం ఆగుతవి. గురుకుజులరాశి చలనం పరిస్థితులను కలవరంగా యుంచగలదు. ప్రయాణం ఆగుతుంది. అందువల్ల దూర దేశంలో మీ రాకకు ఎదురుచూచే ఆప్తులకు ఆశాభంగం కలిగించగలుగుతారు. వారాంతంలో ప్రయాణం లాభకరం. పరిష్కారాలు పై వారానికి మార్చుకోండి. 20 శుభవార్త.

**మీనం** (పూర్వాభాద్ర, 4 వ పాదం ఉత్తరభాద్ర, రేవతి)

ఈవారంలో లగ్నాధిపతి భాగ్యంలో ప్రవేశిస్తాడు. అందువల్ల ఉత్తరోత్తరా ముందు పోవుటకై అనుకూల మార్గం ఏర్పడగలదు. అవకాశాలకొరకు ఎదురు చూడడం అవసరం. కుజరాశి చలనం (ధనాధిపతి వ్యయాధిపతిని సమీపించడం వల్ల) ఆర్థికంగా క్రొత్త చిక్కులను సూచిస్తుంది. త్వరపడి క్రొత్త వ్యాపారాలూ, స్పెక్యులేషన్ జరపడం మంచిదికాదు. గురువు అనుగ్రహంవల్ల సమయంలో సహాయపడే మిత్రులు కలుగుతారు. ప్రతి కక్షుల బలం తగ్గుతుంది. 14 పరిష్కారాలకూ, 15,16 ప్రయాణానికి అనుకూలం 17 శుభవార్త ఆప్తసమాగమం.

## గంటల పంచాంగం

సర్వజిత్ సం॥ని. శ్రావ॥ బ॥ అమా॥
**1947 సం॥ సెప్టెంబరు 14 ఆదివారం**
ఆ॥ అమా రా 1 0 పూఫ రా 10-44 వర్జ్యం, ఉ 8 8 ల 9-36 కు.
**సు॥ పాడ్యమి సెప్టెం॥ 15 సోమవారం**
సో॥ పాడ్యమి రా 10-34 ఉఫ రా 9-2 తే వర్జ్యం 6-54 దు త్యా తె 6-1

